# గాలిబ్
# ప్రేమ శతకము

# ఇక్బాల్
# ఆత్మ శతకము

తెలుగు సేత :

**బెజవాడ గోపాలరెడ్డి**

# GALIB PREMASATAKAM, IQBAL ATMASATAKAM

Telugu rendering by
**Dr. B. Gopala Reddi**



ప్రథమ ముద్రణ మే, 1989
ముఖచిత్రం: అమర్

వెల : రూ. 10/-

ప్రతులకు ;
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు.

ముద్రణ :
శివాజీ ప్రెస్, 4-4-53,
గంజ్ బజార్, సికింద్రాబాద్.

# గ్రంథకర్త జీవన వివరాలు

| | |
|---|---|
| జననము : | 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా,<br>తండ్రి—పట్టాభిరామిరెడ్డి<br>తల్లి—సీతమ్మ. |
| చదువు : | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921—24).<br>విశ్వభారతి, శాంతినికేతన్<br>(1924—27). |
| సమర పర్వము : | సర్కారుబడి వదులుట—జనవరి 1921.<br>జైలు శిక్షలు — ఆరు మారులు.<br>1930, 31, 32, 33 లోను.<br>1940, 41, 42, 43 లోను<br>కొంతకాలం జైలులో ఉండినారు. దాదాపు<br>4 సం॥లు జైలులో మకాం. ఎ.బి.సి. క్లాసుల<br>ఖైదీగా, డెటెన్యూగా. |
| ఉద్యోగ పర్వము : | మద్రాసులో 86 మాసాలు<br>కర్నూలులో 19 మాసాలు<br>(ఆంధ్ర ముఖ్యమంత్రిగా)<br>హైదరాబాదులో 16 మాసాలు<br>(ఆంధ్రప్రదేశ్ మంత్రిగా)<br>కేంద్రమంత్రిగా 66 మాసాలు<br>ఉత్తర్‌ప్రదేశ్‌లో గవర్నరుగా 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రో—ఛాన్సలర్‌గా—<br>జూన్ 1951 నుండి 72 మాసాలు |
| సాహిత్య పర్వము : | తెలుగు భాషాసమితి అధ్యక్షత 1948—86 వరకు<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షత—<br>ఆగస్టు 57 నుండి డిసెంబరు 1982 వరకు<br>కేంద్ర సాహిత్య అకాడమీ (రెండవ తూరి)<br>జనవరి 78_జనవరి 88<br>జ్ఞానపీఠము 1963_71 |

# బెజవాడ గోపాలరెడ్డి పుస్తకాలు

## ముక్తకాలు

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1983)
6. స్ఫులింగాలు—తుషారాలు (1984)
7. స్వప్న హారము
   వీచికలతో సహా (1986)
8. దిపికలు (1988)
9. కళికలు (1989)

## దీర్ఘ కవితలు

1. కాలవాహిని (1979)
2. సాహిత్య సుందరి (80)
3. ప్రసూన మంజరి (81)
4. పరిమళ తరంగాలు (82)
5. సాగర సమీరాలు (83)
6. మలయ మారుతాలు (85)
7. సౌరభ నీరాజనాలు (87)

## అనువాదాలు

1. గాలిబ్ ప్రేమ శతకము
   ఇక్బాల్ ఆత్మ శతకము (89)

## రానున్నవి

1. ఫిర్యాదు—జవాబు (ఇక్బాల్)
2. ఇక్బాల్ ఇతర కవితలు
3. నా సొంతాలు—శశాంక రేఖలు
4. నా సొంతాలు—గులాబి రేకులు

# నివేదన

గాలిబ్, ఇక్బాల్ ఉర్దూ సాహిత్యమునకు సూర్య చంద్రుల వంటివారు. గాలిబ్ సంప్రదాయ పద్ధతిలో ప్రేమలో వియోగమును గూర్చి వ్రాయగా, ఇక్బాల్ ఆధునికుడు, బెర్లిన్ విశ్వవిద్యాలయములో ఇస్లాం ధర్మ విషయమై డాక్టరేటు పొందినవాడు, బారిస్టరై పంజాబు హైకోర్టులో వకీల్ వృత్తిని సాగించినవారు, రాజకీయాల విషయమై చర్చించినవారు. వివిధ విషయాలపై కవితలు వ్రాసినవారు. ప్రగతి భావాలు కలవాడు. ఇద్దరూ పర్షియనులో రచనలు చేశారు కాని ఇక్బాల్ రచనలే ప్రసిద్ధికి వచ్చాయి. ఇంగ్లీషులోనికి తర్జుమా కాబడినవి. సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాన్ హమారా—జనగణమన, వందేమాతరం, తర్వాత మూడవ జాతీయ గీతముగ ఉపయోగపడుచున్నది. సైన్య ప్రవాద్యాలలో దీని స్వరమే ఎక్కువగా వాడుచున్నారు. ఇక్బాల్ సియోల్‌కోటలో జన్మించారు. లాహోరులో నివసించారు. 1928లో స్వర్గస్థులయారు.

1977లో నేను ప్రచురించిన ఇక్బాల్ కవితలకు 'ఆత్మావిష్కారము' అని మిత్రులు డా॥ దాశరథి రచించిన మున్నుడిని దీనిలో చేర్చుచున్నాను. నావి మరి రెండు ఇక్బాల్ అనువాదాలు త్వరలో రాగలవు.

నేను హైదరాబాదులో మంత్రిగా (1956—58) నుండినపుడు మీర్జా గాలిబ్ కవితలను చదువ ప్రారంభించాను. చాలమంది ఆయన గజల్‌లను పాడగా విన్నాను. జాతీయ బహుమతి పొందిన మీర్జా గాలిబ్ సినిమాను చూచాను. ఢిల్లీలోనున్న ఆయన గోరీని చూచాను. ఆ రీతిగ ఆయన సాహిత్యముపై అభిమానము హెచ్చింది.

అట్లనే ఢిల్లీలో కేంద్రమంత్రిగ నున్నపుడు (58—63) అప్పుడప్పుడు చదువుచు వచ్చాను. నా సిబ్బందిలో ఎప్పుడూ ఒక ఉర్దూ బాగా తెలిసిన ఉద్యోగి ఉండేవాడు. తీరిక కలిగినప్పుడు, ఉత్సాహమున్నపుడు చదువుచు వచ్చాను.

మధ్యమధ్య దీర్ఘ అంతరాళములు ఉండేవి. ఉర్దూ లిపి చదువుటలో కొంత కష్టమయ్యేది.

మూడవ మజిలీగా ఉత్తరప్రదేశ్ గవర్నరు (67–72) నయ్యాను, ఉర్దూకు ముఖ్యమైన కేంద్రాలైన మూడు నగరాలలో ఉండుట జరిగింది, హైదరాబాదు, ఢిల్లీ, లక్నోలు. 69 ఫిబ్రవరిలో గాలిబ్ శత వర్ధంతి ఉత్సాహముగా జరిపారు. ఉత్తర ప్రదేశములో అనేక జిల్లాలలో జరిగిన ఉత్సవములలో పాల్గొన్నాను. జన్మించిన ఆగ్రాలో భవనాన్ని చూచాను. సిపాయిల తిరుగుబాటు అనబడు తొలి స్వాతంత్ర్యము తర్వాత (1857) ముస్లింలు చాల యిబ్బందులకు లోనైనారు. అన్నిటిని చూచి 1869 ఫిబ్రవరిలో ఢిల్లీలో గాలిబ్ అస్తమించారు. ఆయన శతవర్షవర్ధంతిని 1969 లో జరిపారు.

మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఆ సందర్భములో నూరు ద్విచరణాలను ఏరి ముద్రించారు. వానినే నేను తర్జుమా చేశాను. ఎన్నిక వారిదే, తర్జుమా నాది, ప్రేమ శతక మని పేరిడినాను. ప్రాచీన ఉర్దూ కవిత, పార్శీలో హాఫిజ్‌వంటి కవుల కవితవలెనే ప్రేమకు సంబంధించినదే. ముఖ్యముగ విప్రలంభ శృంగారము.

గాలిబ్ భావాలు చాల గంభీరములు. వ్యాఖ్యానాలు చాలమంది ఉర్దూలో వ్రాశారు- అర్థము స్పష్టముచేస్తూ. ఆ క్లిష్టత నా అనువాదములోకూడా అటనట కాన్పించును. కొంత ఆలోచించి, వారికి వారు అర్థము చేసికొనుటకు యత్నించవలెను.

ఇక్బాల్ కవితనుగూర్చి గాలిబ్‌ను గూర్చి వ్రాసినది వచ్చే పుస్తకములో చేర్చుచున్నాను. డా॥ దాశరథి ముందు మాటలలో కొంత ప్రస్తావించారు.

బెంగాలీనుండి రవీంద్రుని, ఉర్దూనుండి గాలిబ్, ఇక్బాలను అనువాదములు చేసి తెలుగువారి కివ్వగలిగినందులకు నేను సంతసించుచున్నాను. బాగైనా, ఓగైనా నా ప్రయత్నానికే నా ఆనందము. రెండూ భారతీయ భాషలే. పువ్వులు వేరైనా, తోట ఒక్కటే!

నా ప్రచురణలకు తోడ్పడుచున్న శ్రీ యార్లగడ్డ ఆంజనేయులకు కృతజ్ఞతలు.

**శాంతినికేతన్**
నెల్లూరు – 3
14–4–1989.

బెజవాడ గోపాలరెడ్డి.

# గాలిబ్
# ప్రేమశతకము

*Dedicated*

TO

**– JANAB IQBAL ALLADIN**

**– BEGUM BILKIZ ALLADIN**

**– BEGUM ROSY ALLADIN**

For their uniform
Courtesy and generosity
With my grateful affection.

**– Author**

# గాలిబ్

# ప్రేమ శతకము

1

ప్రతికార్యం సులభమగుట
వీలు కాదు
ప్రతిమనిషీ మహామానవు డగుట
వీలు కాదు.

2

నీ కనురెప్పలు చెమ్మగిలుట ప్రళయమే
వాని చూచి ఎందరెందరి రక్తము
నీరైనదో ఎరుకలేదు.

3

దుఃఖము ప్రాణాన్ని కష్టపెట్టేదైనా
ఎట్టి గుండెగా జీవిస్తున్నది?
ప్రేమ దుఃఖము లేకపోతే
జీవిత దుఃఖాన్ని సహించాలె!

4

అభిలాషకు రెండవ చరణమేది, ప్రభూ!
ఈ విశ్వాన్ని మొదటి చరణచిహ్నముగా
భావిస్తున్నాము.
(రెండవ చరణము ఆమె మీద ప్రేమ)

5

పుష్పసౌరభాలు హృదయ విలాపాలు
సభా దీప ధూమాలు
ఏవి నీ గోష్ఠినుండి బయట పడుచున్నవో
అవి చెల్లాచెదరై వ్యాకుల పడుచున్నవి.

6

చలికాలపు కాళ్ల గోరంట
వసంతము ఇదే యైతే
ప్రపంచ విలాసాలు
శాశ్వతముగా హృదయ బాధాకరములే!

7

నీ వాగ్దానాలమీదనే జీవించియున్నాను
అని నీవు తలిస్తే పొరపాటు.
నిజముగ నమ్మకమే కుదిరియుంటే
సంతోషముగ అప్పుడే మరణించెడి వాడను

8

ప్రాణప్రమాదాలు ఆమె విషయా లన్నీ
వేషభూషల వైఖరులేమి, సంజ్ఞలేమి!
హావభావాలేమి!

9

ఆశలకు ఎన్నెన్ని ఆనంద కారణాలు
మరణించుటే లేకుంటే
జీవించుటలో ఆనందమేమి?

10

ప్రపంచములో భక్తి విశ్వాసాల చిహ్నాలు
సంతుష్టికి హేతువులు కావు
అవి అర్థాలకు లొంగి సిగ్గిలే మాటలు కావు.

11

నన్ను చంపిన తర్వాతనే
హింసను పరిత్యజించింది.
ఈ పశ్చాత్తాప భావము
కొంత ముందే జనించియుంటే
నేను చచ్చేవాడిని కాదు గదా!

12

విధివంచితులమై
ఎవరిని నిందించగలము?
మరణించాలని కోరుకొన్నాము
కాని అది కూడా కరుణించుట లేదు!

13

అద్దములో చూచుకొని
ఆమె సౌందర్యానికి ఆమె విభ్రాంతురాలై నది
ఆమె హృదయాన్ని ఎవ్వనికీ ఇయ్యనందులకు
ఆమెగారికి ఎంత గర్వముగా వున్నదో!

14

ప్రసూనాల వైభవదీప్తులు,
దృష్టినేర్పు మనము పొందినాము
అన్ని రంగుల తిలకించి వికసించుటయే
నయన కర్తవ్యము.

15

రహస్యపు మధుర రవళులు
మనకు అర్థములు కావు
మరుగున వున్నది
జంత్రవు మెట్టుల మర్మము.

16

వన్నెల వెదజల్లిన ప్రభాతమున
మనోహరమైన వసంత దృశ్యము ఇది
ఒయ్యారాల పువ్వులు వికసించే
కాలము ఇది!

17

నేను గుప్తముగనున్న సాధువునే
గమనించు, నన్ను ఎవరైన ఎదుర్కొంటె
బహిరంగముగ తిరస్కరించువాడనే
అగుదును!

18

తిరిగి నీ వీథికి పోయినవి తలంపులు
అప్పుడే నీ రాకపోకల త్రోవ జ్ఞప్తికి వచ్చింది.

19

రక్త తరంగాలు శిరమునుండి
ప్రవహించినా సరే
ప్రేయసి ప్రాంగణమునుండి
లేచి పోతామా?

20

ప్రేమచేత జీవిత ఆనందాన్ని
మన ప్రవృత్తి యిచ్చింది.
ప్రపంచ వేదనలకు ఔషధము ప్రేమ
ప్రేమ వేదనకు లేదు ఔషధము.

21

ప్రపంచ గోష్ఠిలో స్వర్గధామమును
దీపపుకాంతిగ అర్థము చేసికొన్నాము
ప్రేమజ్వాలను మా సమస్త సంపదగ
అర్థము చేసికొన్నాము.

22

రేయింబవలు రోదసిలో
తిరుగుచుంటాయి ఏడు ఆకాశాలు
ఏదో ఒకటి జరుగుతునే వుంటుంది
అందుకై ఆందోళన పడతామా?

23

భయతత్త్వపు వేడి ఎచ్చటని
నివేదించుకొంటాము
ఏదో భీషణ భావము వచ్చింది
వనమే కాలిపోయింది.

24

జాగ్రత్తగ వినిపించడానికి వలను
ఏరీతిగా పరచినను
తన చెప్పే తీరు
అపూర్వ పక్షివేటగా తయారగుతుంది.

25

నేను పుష్పగానమును కాను
వాద్య జంత్రపు మెట్టును కాను
నా పరాజయ కంఠధ్వనిని మాత్రమే!

26

ప్రభూ! నా మాట ఆమెకు అర్థము కాలేదు
ముందు అర్థము చేసికోదు
నాకు వేరే నాలుక ఇవ్వనిచో
వేరే గుండె ఆమెకు ఇమ్మా!

27

ఈ బొబ్బల కాళ్లతో
నేను తత్తర పడ్డాను
మనస్సు సంతోషపడినది
త్రోవలో చాల ముళ్లు ఉండుటను చూచాను.

28

ఆ నిష్ఠురమూర్తిని పూజించుట మానను
లోకులు నన్ను మూర్ఖుడనని
అనుట మానక పోయినా సరే.

29

ప్రేయసి ముఖదీప్తిని కాంచి
ఎందుకు నేను కాలిపోలేదు?
నా వీక్షణా శక్తిని చూచి
నేను ఈర్ష్యపడి కాలిపోవుచున్నాను.

30

సూర్య కిరణముల నుండి
మంచు వినాశ పాఠముల నేర్చింది.
కనికరపు వీక్షణకై నేను
నాశనమగుటకు ఎదురుచూచుచున్నాను.

31

ప్రేమ ఓరిమిని కోరేది
కోరిక అశాంతితో త్వరపడుచున్నది
గుండె నెత్తురులో తేలే లోపల
దానికి ఏ రంగు పూస్తూరావాలె?
దానిని సమాళించే దెట్లా?

32

అలలు వలతో పట్టుకొంటాయి
మొసలి గొంతులో బిలాలున్నాయి
చూడు నీటిచుక్క ముత్యమయ్యే లోపల
ఎన్నెన్ని చిక్కుల దాటుతుందో!

33

నిర్లక్ష్యము చేయనని ఒప్పుకుంటాను
కాని నా విషమస్థితి నీకు తెలిసే లోపల
మట్టితో కలిసిపోతాను.

34

జీవితమనే గుర్రం పరుగులో ఉన్నది
చూస్తాము ఎక్కడ ఆగుతుందో!
చేతుల్లో కళ్ళెలు లేవు
రికాబ్‌లో కాళ్లు లేవు.

35

దుఃఖ విలాప రాగిణులు కూడ
హృదయమా! ఒక సంపదగా తలచుకో
శబ్దరహిత మగుతుంది
జీవిత చరిత్రము ఒకనాడు.

36

కల్పనల అనంత ఆవేశంలో
పాటలు పాడుకొంటున్నాను
ఉద్యానవనపు కోకిలగా
నేను పుట్టకపోయినా, పాడుకొంటున్నాను!

37

నిరీక్షణలో జీవితమంతా నిద్రరాదు
కలలలో కన్పించే ఆమె
వస్తా నని వాగ్దానం చేసి వెడలింది.

38

గోష్ఠిని ఎన్ని రకాలుగా అలంకరించితివో
మాకు జ్ఞాపకమున్నది.
కాని ఇప్పుడు మరపు గూటిలో దాచిన
అలంకారా లయ్యాయి.

39

జీవితములో పట్టుబడి పుట్టడం
దుఃఖానికి దాసుడు కావడం
రెండూ నిజముగ ఒకటే
చావుకు ముందు మనిషి
దుఃఖాన్నుండి ఎట్లా విముక్తి పొందుతాడు?

40

సన్న చెట్టువలె ఉన్న
నీ పొడవు సొగసు మాకు ప్రళయమే
నీ పొడవునుండి మనిషి ప్రమాణము తీసివేస్తే
ఏమీ లేనట్లే, ప్రళయాందోళనలు
తక్కువగా తోస్తున్నాయి.

41

నిద్ర అతనిది, మెదడు అతనిది
రాత్రిళ్లు అతనివి
నీ శిరోజాలు ఎవని భుజాలపై
చెల్లా చెదరగునో!

42

లోకులు నా గుండె గాయాలను
ఎందుకు చూస్తారు?
ఏవి ఆ గాయాల కలిగించాయో-
ఆమె భుజాలు, హస్తాలు
వానిపై దృష్టిదోషము తగుల్తుందేమో!

43

ఎల్ల వేళల తిరుగుటచే
గుండె ఎందుకు భయాందోళనకు
వశము కాదు?
మానవుడను గదా!
గోష్ఠిలో తిరిగే పాత్ర - కూజా
కాదుగదా నేను?

44

సిగ్గు ఒక విలాసపు చేష్ట
తను ఒక్కతే ఉన్నప్పుడు సహితము
ఎందరు సిగ్గు విడనాడినారు?
పర్దాలో ఎట్లాగో ఉండికూడ.

45

ఆమెది హృదయాన్ని దీప్తిమంతము
చేసే సౌందర్య వైభవము
రూపురేఖలు మధ్యాహ్న సూర్యునివి
స్వయముగ మనోహర దృశ్యాలను
కాంతిచేత దగ్ధము చేస్తుంది
అయినా పర్దాలో ఎందుకు
ముఖాన్ని దాచుకొంటుంది?

**46**

విశేష ఆనందాల నిచ్చే ఆమెకు
ఏ ముఖముతో ధన్యవాదాలు తెలిపేది?
ప్రశ్నల అడుగుచున్నాను,
కాని సంభాషణ పాదాలు మధ్యలో లేవు
సంభాషణ సాగుటలేదు!

**47**

పరాయి దేశముపై నిందారోపణ
ఏ ముఖముతో చేస్తున్నావు?
నీపై అనురాగం చూపని
నీ దేశపు చెలియలు జ్ఞాపకము రారా?

**48**

నిన్ను కలియుట తేలిక కాదు
అది నాకు తెలిసిన విషయమే
ఇబ్బంది ఇదే!
ఇబ్బందులు లేకుండా చేశావు
కలిసేవారు కలుస్తూనే ఉన్నారు.

49

పూర్వకాలపు వారు వీరు
వీరిని గూర్చి ఏమీ చెప్పకు
మధువు, గానము
ఆకర్షించే విషయాలని
ప్రమాద కారకములని
పలుకుచుంటారు.

50

రహస్యమైన క్రీగంటిచూపుకై
లక్షల ఆసక్తులు
చిందులు త్రొక్కి కోపముతో
లక్షల హావ భావాలు, ఒయ్యారాలు!

51

రెండు లోకాలు చూచి
సంతోషమైందని తలచింది
ఇచ్చటికి వచ్చిపడి
సిగ్గుతో వివాదము ఎందుకు పడుతుంది?

52

మట్టిలో ఎట్టి రూపాలున్నాయో
అన్నీ ఏవీ? కొన్ని పువ్వులతో
బహిర్గతమైనాయి
కొన్ని మరుగుననే పడి ఉన్నాయి.

53

మేము ఏకేశ్వరోపాసకులము.
మా పద్ధతి, ఆచారవ్యవహారాల వదలడం
మతాలు మాసిపోతే
ఏక విశ్వాసానికి అంగములై
పుష్టి నిస్తాయి.

54

ఇంకెవరూ లేని ప్రదేశానికి
వెళ్లి ఉండిపో
సంభాషించేందులకు ఎవరూ ఉండరాదు
అర్థము చేసికొనేవారు ఎవరూ ఉండరాదు
అట్టి స్థలానికి!

55

స్వర్గప్రశస్తిని వింటున్నాము
అది బాగానే ఉన్నది
దేవుని కృపతో, నీ వైభవ ప్రభాస స్థానమే
స్వర్గమైతే బాగుంటును.

56

చికాకుతో విసుగు కొంటున్నావు
అద్దములో నీవు చూచుకొన్నపుడు
నగరములో నీవంటివారు
మరొకరో ఇద్దరో ఉండిఉంటే
ఏమయ్యేదానివో!

57

ఒరే పిరికి రొమ్ము గలవాడా!
హృదయము అగ్ని గుండము కాకపోతే
నీ ఉచ్ఛ్వాసము నీ విలాపాల విషయము
పలుకకపోతే
నీ గుండె సిగ్గును చెందుతుంది.

58

నీవు ఇంత సున్నితమైన దానవు
మా మౌనాన్ని రోదన అని అంటావు
మేము యాచకులము.
నీ అశ్రద్ధకూడా మా మీద
దౌర్జన్యమే అగుతుంది.

59

మనిషి స్వయముగ
అశేష భావాల ప్రళయము
ఏకాంతమైన ప్రదేశమైనా
జనసందోహ సమ్మర్దముగా తలుస్తుంటాడు.

60

ఆమె తన అలవాటుల మానదు
మేము మా పద్ధతుల ఎట్లా మానుతాము?
తేలిక తలల చేసికొని మేము
మమ్ము నిర్లక్ష్యము చేసే ఆమెను
ఏమి అడుగుతాము?

61

ఎవతెకైన హృదయ మిచ్చి
ఆర్తాలాపము ఎందుకు చేస్తావు?
వక్షములో హృదయమే లేనపుడు
నోటిలో నాలుక మాత్రం ఎట్లా ఉంటుంది?

62

నా హృదయ విషయాలన్నీ
ఎవరిమీదో ఎందుకు ప్రకటితమగుతాయి?
నా కవితల పేరికూర్చినాను.
అవే నాకు చెడ్డపేరు తెచ్చాయి.

63

వినవద్దు- ఎవరైన చెడ్డమాట చెపితే,
చెప్పవద్దు- ఎవరైన చెడ్డపని చేస్తే,

64

చెడ్డ నడక గలవానిని ఆపు
చెడ్డ చేసినవానిని క్షమించు!

65

రక్తము చిందే ఉన్మాదుని కథలు వ్రాస్తుండు
చేతిని నరికివేసినా వ్రాస్తుండు!

66

నా జీవితము ఈ దీనస్థితిలో గడుపుతున్నా
దేవుడు రక్షించేవాడని ఎట్లా జ్ఞాపకము పెట్టుకొనేది?

67

వెయ్యి మధుపాత్రలు, మధుశాలలు
మొక్కగా యిచ్చేస్తా
నీ చూపులలోని సొగసులు అందచందాలు
ఈ మధువుకు ఏమి తెలుసు?
(ఇది గాలిబ్ కవిత కాదని నా భావన ఇంకొకరి కవితలో చూచాను.)

68

రాత్రి స్నేహమునుండి
పొందిన వియోగపు కళంకము వెలుగుతుంది
దీపముగా ఉండినదే
ఆరిపోయింది.

69

ప్రమాదములైన ఆపదలన్నీ పూర్తి అయ్యాయి
హఠాత్తుగ వచ్చే మరణము మాత్రము
ఇంకా మిగిలియున్నది.

70

సఖుల గతి విలాస వీక్షణ ఆనందాలు
మంజీర రవళుల శ్రవణ కుతూహలాలు
ఒకటి స్వర్గాన్ని చూచిన కన్నులు
ఒకటి వైకుంఠస్వరాల విన్న చెవులు

71

నీవు సౌందర్యానికి పరాకాష్ఠవు
నేను ప్రేమకు అంత్యశిఖరాన్ని
నిన్ను చూడదలచుకొన్నవారు
ముందు నా స్థితిని చూడాలె!

72

స్నేహాల మధ్య పర్దా
పరాయిది- పొసగదు
ముఖం దాయడం నా వద్ద
వదలివేయాలి.

73

సహస్ర అభిలాష లున్నాయి
ఒక్కొక్కటి ప్రాణము తీసివేసితే
కోరికలు చాల వెలికి వచ్చాయి
కాని తక్కువే వచ్చాయి.

74

నల్లని శిరోజాలు చెల్లాచెదరై
ముఖాన్ని కప్పుచుండ
ప్రేయసి పైన కాన్పించింది
ఆమె అధరాలపై ఎన్ని దురాశలు
మూగి వేడుకుంటున్నాయి.

75

చేతుల్లో శక్తి లేకపోయినా
కళ్లల్లో ఊపిరి ఉన్నది.
ఉంచు సాఖీ! నా ముందు
మధుపాత్రను, కూజాను!

76

నాకు కూడ నోటిలో నాలుక ఉన్నది
నీ ఉద్దేశ్య మేమని అడిగియుంటే
ఎంత బాగుండేది?

77

నరాల్లో పారుతూ తిరుగుచున్నదని
నేను ఒప్పలేకయున్నాను.
కళ్లనుంచి కారనిది
అదెట్టి రక్తము!

78

అగ్ని జ్వాలలలోలేదు ఈ అద్భుత శక్తి.
మెరపులలో లేవు ఈ ఒయ్యారపు సొబగులు
ఆకర్షణీయమై మనోరంజకమైన
స్వభావశైలి ఎవ్వరిదో ఎవరైన చెప్పగలరు!

79

సంభాషణ శక్తి లేదు
అసలు ఉండినా
ఏ ఆశతో చెప్పేది
నా కోరిక ఏదో—

80

శక్తి ఉంటే, మట్టినే అడిగేవాడిని
"లోభీ! అమూల్య సంపదలను
ఐశ్వర్యాలను కలిగినవారిని
కడుపున దాచుకొని
ఏం చేశావు?" అని.

81

చావుకు ఒక దినము
నిశ్చితమై యున్నది,
ఒక్క నిమిషము ఆలస్యంగ రాదు
రాత్రి రావలసిన నిద్ర
రాత్రంతా ఎందుకు రాదు?

82

నాకు మంచి చెయ్యాలని
ఆమె మనస్సులో సంకల్పము కలిగినా
దౌర్జన్యాల చేసిన జ్ఞాపకాలు వచ్చి
నన్ను చూచి సిగ్గుపడిపోతుంది.

83

చంద్రుని సౌందర్యము
పౌర్ణమిరేయి పూర్తిగ శోభిల్లినా
దాని కన్న నా శశి
సూర్యదీప్తితో ఇంకా శ్రేష్ఠము.

84

ఇంట్లో ఏమి ఉన్న దని
నీ మీది దుఃఖము ఇంటిని నాశనము చేసింది?
ఇంట్లో దాచుకొన్నది
ఇంటిని కట్టాలనే నెరవేరని కోరిక మాత్రమే!

85

అప్సరసల ముఖ సౌందర్యము గల ఆమె
ప్రేమించి మరింత సౌందర్యవతియైనది
రంగు వికసించే కొద్దీ
కొంతరంగు తరిగిపోతుంది.
(ఎక్కువ రంగు గలవారు
కొంతరంగు తగ్గితే ఇంకా అందంగా ఉంటారు)

86

నిరాశల రాశీ! ఎట్టి విపత్కరమైన సంకటమిది
నన్ను తెప్పరిల్లు కోనీ,
ప్రేయసి కల్పనల కొంగు కూడ
నా నుండి జారిపోయింది.

87

నా స్థితిని గూర్చి చెప్పదలచుకొంటే
'అదంతా ఎందుకు, కావలసింది చెప్పు' అంటావు
నీవే చెప్పు, అట్లా చెప్పితే
చెప్పడ మగుతుందా?

88

మేముకూడ అలవాటు పడాలె
అది ఒప్పుకొంటున్నాము
నీ నిర్లక్ష్యము నీకు అలవాటై పోయింది
అది నీకు బాగానే ఉన్నది.

89

సాకీతో చెప్పడానికి సిగ్గగుతుంది
లేకుంటే మధుపాత్రలోని అడుగైనా
మాకు సరిపోతుంది
అదే మాకు అమూల్యమైనది!

90

హృదయ దుఃఖమా! ఆమె ఇప్పుడు
అన్ని తప్పులు పట్టుచున్నది
ఆమెకు ఏమీ చెప్పడం సాధ్య పడదు,
మాటలు కుదర్పలేని చోట
ఏమి మాటలు కూర్పగలము?

91

వ్రాసేటప్పుడు కాగితము మీద
సిరా పడిన రీతి
నా విధిలో విరహరాత్రుల బొమ్మలు
మాత్రమే గీయబడినాయి.

92

మధుశాల కవాటాలు ఎక్కడ
ఉపదేశికుడైన ముల్లా ఎక్కడ
ఇంత మాత్రము నాకు తెలుసు
నిన్న నేను బయట వస్తుండినప్పుడు
అతడు లోన జొరబడుచుండినాడు।

93

కోరుకో గలిగినంత
మంచివాళ్ళను కోరుకో
వారే నిన్ను కోరితే
మరేమి కోరాలె?

94

చూడు- ఇతరులతో ఎంత బాగా ప్రవర్తిస్తుందో
మా మీద ప్రేమ చూపక పోయినా
ఇతరులతోనైన విశ్వాసముతో మెలగుతుంది
అదైనా మంచిదే, ఆమెలో విశ్వాస భావ మున్నది

95

దైవమా, హృదయావేగముల
ఫలితము వ్యతిరేక మగుచున్నది
నేను ఎంత లాగుచున్న
అంత ఆమె లాగుకొని
దూరమగుచున్నది నా నుండి.

96

నిర్లక్ష్యము చేసే లోకులతో
విసిగి వేసారకు, నిష్ఠురడవు కాబోకు
ప్రాణమా! నీకు ఎవరూ
కావలసినవారు లేకపోతే
దేవుడే ఉన్నాడు.
(చచ్చిపోవచ్చును).

**97**

వేధించే ప్రేయసీ!
కష్టాలు చెప్పుకొనుట కైనా అనుమతి ఇమ్మ
నా కష్టాలలో నీకు కొంత
ఆనందము కలుగవచ్చు.

**98**

నా విధిలో ఇన్ని కష్టాలే వ్రాయబడియుంటే
మరికొన్ని గుండెలు యిస్తూ వ్రాసింటే
బాగుండేది.

**99**

ఉపదేశకుడు
చెడ్డగా మాట్లాడితే
తప్పుగా అనుకోకు
అందరూ 'మంచి' అనే మనిషి
ఎవడైనా ఉన్నాడా?

## 100

జంత్రము రాగాలతో నిండియున్నట్లు
నేను ఫిర్యాదులతో నిండియున్నాను
తీగలను కొద్దిగ మీటి చూడు
ఏమి బయటపడుతుందో!

## 101

చూడు కాలిజాడలు,
హృదయాన్ని హరించే ఒయ్యారాలు.
ప్రేయసీ గమన తరంగాలు
పూచే పువ్వులు
అందరూ కళ్లకు అద్దుకొంటున్నారు
దానిలో నే వివాదాలు పడుతున్నారు.

# ఇక్బాల్
# ఆత్మ శతకం

Dedicated

to

My friend and well wisher

**LATE DOSTH MOHAMMED ALLADIN**

(Born 31-5-1909 Expired 13-1-1973)

a large hearted, philanthropist

and

a prominent Industrialist of Hyderabad.

# ఆత్మావిష్కారము

కీ.శే. డా॥ దాశరథి

బహుముఖ ప్రజ్ఞాశాలురైన మహాకవులలో ఇక్బాల్ ఒకడు. ఆయన భారతదేశ కవి మాత్రమే కాదు. ఆయనను ప్రాక్ ప్రపంచ కవి అనడం సబబనుకుంటాను. శతాబ్దాలుగా దాస్యాంధకారంలో మగ్గియున్న ప్రాక్ ప్రపంచాన్ని చూచి ఆయన చాలా వేదన పడ్డాడు. పాశ్చాత్యులు ప్రాక్ ప్రపంచాన్ని అంతటినీ బానిస శృంఖలాలతో బంధించారు శతాబ్దాల పాటు.

ఈ తూర్పులో ఎప్పుడు తెల్లవారుతుంది? ఎప్పుడు స్వాతంత్ర్య భానూదయం జరుగుతుంది? అని వెత చెందినవాడు ఇక్బాల్. మహమ్మదీయుల దేశమని, బౌద్ధుల దేశమని, హిందువుల దేశమని కాకుండా తూర్పులోని దేశాలు చాలావరకు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి పాశ్చాత్యులకు తలయొగ్గిన స్థితిని చూసి ఎంతో వేదన పడిన ఇక్బాల్ లేఖిని లోనుంచి వెలువడిన కవితలు చిరస్మరణీయాలు.

"విప్లవం లేని జీవితం మృత్యువుతో సమానం" అన్నాడు ఇక్బాల్. అతని ప్రఖ్యాత రచన "బాలె జిబ్రయీల్" లోని "దేవతలకు భగవంతుని ఆదేశం" అన్న కవితలో ఆయన వ్యక్తపరచిన విప్లవాత్మక భావాలను అవగతం చేసుకొని, ఇక్బాల్‌ను మించిన విప్లవకవి లేడు అనుకున్నాను నా చిన్నతనంలో.

"పేదలకు తిండిపెట్టలేని పొలాలను తగుల పెట్టండి. మేల్కొండి. పేదలారా! ధనికుల మేడలు పడగొట్టండి. బానిసల రక్తాన్ని పొంగించండి. ప్రజాస్వామ్యయుగం వస్తున్నది." అని ఎలుగెత్తి చాటాడు ఇక్బాల్.

అయితే ఈ విస్తృత సిద్ధాంతాలను మించిన గంభీరమైన తాత్త్విక భావన ఆయన కవితలో ఉన్నదని అర్థంచేసుకోవానికి ఆయన ఇతర రచనలు "అర్ ముగానె హిజాజ్", "జర్బెకలీమ్", "బాలె జిబ్రయీల్"ల లోని ఆత్మావిష్కారఘట్టము చదవాలి.

"కళ్ళు తెరువు; భూమిని చూడు;
ఆకాశాన్ని తిలకించు; ప్రకృతిని పరికించు;
తూర్పునుంచి ఉదయిస్తున్న సూర్యుణ్ణి కాస్తచూడు!"

అంటూ విశ్వాత్మ మానవుని ఆహ్వానిస్తున్న ఘట్టంలో (బాలె జిబ్రయీల్) ఇక్బాల్ అనాది అని స్పష్టమవుతుంది అతని విశాల హృదయం పరిశీలించి చూస్తుంటే, ఆయన భారతీయ, మహమ్మదీయ, బౌద్ధ పాశ్చాత్య సిద్ధాంతాలను సహృదయంతో ఆకళింపుకొని తనకు నచ్చిన వాటినన్నిటినీ జీర్ణించుకున్నాడు. భగవద్గీతలో కృష్ణ భగవానుని కర్మ సిద్ధాంతం, బుద్ధుని కారుణ్యభావం, భర్తృహరిలోని నీతి, వైరాగ్యాలు ఆకళించుకున్నాడు.

"ఆచరణే జీవితం" అన్న ఇక్బాల్ మాట భర్తృహరి భావనే. ఆచరణ ఉత్తమమైన దైతే, జీవితంసమ్యం చేరుకోగలం. అలా కానప్పుడు మానవుడు విఫలుడౌతాడు- అన్నాడు ఇక్బాల్ ఒకచోట.

అన్నిటికంటె ఇక్బాల్ రచనలలో నన్ను ఆకర్షించింది "ఖుదీ" (ఆత్మ). మానవుని ఆత్మమీద ఇక్బాల్‌కు చాలా విశ్వాసం వుంది. "ఆత్మే జీవం; ఆత్మను కోల్పోవడమే మృత్యువు" అంటాడు ఇక్బాల్ ఒకచోట.

డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇక్బాల్ రచనల అనువాదానికి, ముఖ్యంగా ఇక్బాల్ ఆత్మతత్త్వ ప్రబోధకమైన రచనల అనువాదానికి పూనుకోవడం నాకు ఎక్కువ ఆనందాన్నీ, తృప్తినీ కలిగించింది.

నిజానికి 'ఖుదీ' అన్న మాటకు శబ్దార్థం వ్యక్తిత్వం. కాని ఇక్బాల్ దాన్ని "ఆత్మ" అనే అర్థంలోనే వాడాడు. గోపాలరెడ్డిగారు 'ఖుదీ' అన్న చోటల్లా 'ఆత్మ' అన్న పదం వాడడం ఎంతో సమంజసంగా వుందని నేను భావిస్తున్నాను.

"ఆత్మ చచ్చిపోతే గాలివీచుట
గడ్డిపోచవలె నుందువు;
ఆత్మ బ్రతికియుంటే
నీవు మహాపదముల ఏలు చక్రవర్తివి'

ఈ పంక్తులు చూడు, ఇక్బాల్‌కు ఆత్మపైన ఎంతటి మమకారం, విశ్వాసం వున్నదో చెప్పడానికి. ఏదో వ్యక్తిని ఉద్దేశించి చెప్పినట్లుగా అనిపించినా, నిజానికి ఇక్బాల్ తన జాతిని, తన బానిస దేశాన్ని దాస్యంలో మగ్గుతున్న ప్రాక్ ప్రపంచాన్ని అంతటినీ అతడు ఉద్దేశించి ఈ వాక్యాలు అన్నాడని నేను భావిస్తున్నాను. ఆత్మ ప్రాక్ ప్రపంచానికి జీవం.

"ఆత్మ చావగా
తూర్పు జాతుల పురాణములలో
దైవ రహస్యముల ఎరిగినవాడు
ఎవడును పుట్టలేదు"

మహాత్ములకు దేశాలే కావు, తూర్పు సొంతం ఆత్మ తేజోమయమని ఆయన విశ్వాసం.

"ఆత్మ బతికియుంటే
దరిద్రుడే మహారాజు
లేకున్న, మహారాజే
దరిద్రునికన్న హీనుడు"

శ్రీ గోపాలరెడ్డిగారు జటిలమైన ఇక్బాల్ ఆత్మతత్త్వాన్ని చిన్న మాటలలో పాఠకులకు సుబోధకంగా అనువదించా రనడానికి పై పంక్తులు తార్కాణాలు.

ఇక్బాల్ నిర్వచించే ఆత్మ తొలిమజిలీలో భౌతికమే. కాని క్రమ క్రమంగా ఉన్నతి పొంది భౌతిక శక్తులను లొంగదీసుకుని భగవత్ సాక్షాత్కారమును పొందుతుంది.

"దేవుని చూచు భక్తుడు
ఆత్మ జాగృతము కాగా
వాడిగల, కాంతిగల
ఖడ్గమువలె అగును."

అన్న పంక్తులలో ఆత్మశక్తి ఆవిష్కృతము. ఆత్మశక్తి కల జాతికి ఆయుధాలతో పనిలేదని ఇక్బాల్ ఒకచోట అంటాడు.

"ఆ దేశమునకు
ఆయుధములతో పనిలేదు
ఏ దేశ యువకుల ఆత్మ
ఉక్కువలె గట్టి అగునో!"

ఆత్మ అంటే ఏమిటో, పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చెప్పిన పద్యాలు కూడా ఇక్బాల్ రచనలలో ఉన్నవి. ఉదాహరణకు :

"నీ జీవితము ముత్యపు చిప్ప,
వర్ష బిందువు ఆత్మ;

అది ఎట్టి శుక్తి—
వర్ష బిందువును ముత్యము చేయలేనిది ?"

వర్ష బిందువును ముత్యం చేయలేని శుక్తి శుక్తి అనిపించుకోడానికి యోగ్యము కాదు. అట్లాగే ఆత్మావిష్కారము చేసికొనలేని జీవితము జీవితమే కాదు.

మరోచోట అంటాడు:
"జీవితసారము ప్రేమ;
ప్రేమసారము ఆత్మ" అని.

ప్రేమవలన ఆత్మ పరిపక్వ మవుతుంది.

''దేవుణ్ణి చూడా లనుకుంటే నీ ఆత్మ లోతులను చూడు!''అంటాడు ఒకచోట ఇక్బాల్. మానవుణ్ణి సంపూర్ణ మానవునిగా రూపొందించడానికీ, భగవంతునితో ఏకత్వం సాధించడానికీ ఆత్మయే ఉత్తమ సాధనం.

''విద్యా ద్రావకములో
నానవేయుము నీ ఆత్మను;
మెత్తన కాగా వినియోగించు
ఎక్కడ వలసిన అక్కడ''

విద్యాద్రావకంలో ఆత్మను నానవేయడం అనే భావం మూలంలో వుంది. మూలంలోని సొగసును యథాతథంగా మనకు తెలియ జేయడంలో గోపాలరెడ్డిగారు విజయం సాధించారు. ఉత్తమ అనువాదం. మూలానికి విధేయంగా వుండాలి. అనుకరణ, అనుసరణ, అను పునస్సృష్టి కారాదు. అనుసరణలో మూల సౌందర్యం నశిస్తుంది. ఫారసీలో ప్రేయసీ ప్రియుల ప్రణయాన్ని

ఇక్బాల్

# ఆత్మ శతకము

1

అన్ని అదృష్టాల కన్న మిన్నగ
ఆత్మను పెంచుకో! అప్పుడు
దేవుడే భక్తుని స్వయముగ అడుగును
"చెప్పు నీ ఇష్టమే"? మని

2

ఆత్మగూడు నీ దెందములోనే,
ఆకసము కనుపాపలో ఇమిడిన రీతి!

3

ఆత్మ అంటే ఏమి? జీవన సంఘర్షణల రహస్యము!
ఆత్మ అంటే ఏమి? సృష్టిని మేల్కొలుపడం!

4

ఆత్మ యంత్రములోనే
శాశ్వతజీవన అన్వేషణ
ఆత్మ జ్వలన చేతనే
జాతుల దీపములో వెలుగు.

5

అహంలో మునుగు తున్నారు
తిరిగి పైకి తేలుతున్నారు విజ్ఞులు:
కాని ఈ సాహసము
అజ్ఞులలో లేదు.

6

ఆత్మ బ్రతికి ఉంటే
అపార సాగరాలు నడకతోనే దాటవచ్చు,
ఆత్మ బ్రతికి ఉంటే
కొండ వరుసలు ముఖ్మల్‌వలె మెత్తన!

7

ఆత్మ బ్రతికి ఉంటే
దరిద్రుడే మహారాజు,
లేకున్న మహారాజే దరిద్రుడు!

8

ఆత్మ చావగా
తూర్పు నాడుల మాగాణములలో
దైవ రహస్యములు ఎరిగినవారు
ఎవరును పుట్టలేదు.

9

ఆత్మ చచ్చిపోతే, గాలి ఎదుట
గడ్డి పోచవలె నుందువు
ఆత్మ బ్రతికి ఉంటే
నీవు చరాచరముల నేలు చక్రవర్తివి!

10

జీవితమనగా దృష్టి ఆలోచనల సమైక్యత!
ఆత్మ చావగా
భిన్న భిన్నమైన సందేహాలు!

11

తారల భ్రమణములు
ఆకసముల పరివర్తనాలు కావు,
నీ ఆత్మయొక్క చావు
నీ వైభవముల పతనము.

12

ఎవరిలో లేదు
పెద్దరికపు కోరిక?
ఆత్మ చావగా
ఇక ఎక్కడిది వాని పెద్దరికము?

13

నీ జీవనమే చచ్చును
అభివృద్ధి, అభిలాష లేనపుడు
కలదు దైవత్వము
ఆత్మ నిర్మాణములోనే!

14

పోగొట్టు కొంటిని
నీ ఆత్మను నీవు;
అన్వేషించవుము
పోగొట్టుకొన్న వస్తువును.

15

అర్థించడం దేనికి?
ఇతరుల తలంపులకై, ఊహలకై?
లేదా ఏమి నీలో
నీ ఆత్మను చేరగలగడం?

16

ఆత్మలో మునిగే వారి
స్థైర్య సాహసాలే
సృష్టించాయి ఈ కాలువలోనే
అనంత సాగరాలు!

17

ప్రమత్తుడా! ఆత్మలో మునిగిపో
ఇదే జీవిత రహస్యము
ప్రభాత సంధ్యా శృంఖలమునుండి
బయటపడి, శాశ్వతత్వమును పొందు.

18

నీ రాళ్ళ బాటలో పుట్టాయి
వేల చెలమలు
ఆత్మలో మునిగి కలీం రీతి*
దెబ్బకొట్టి దారి చేసికో!
(*భగవంతుని దూత)

19

గట్టులు లేని కడలి
నీ ఆత్మ;
నీవు దాన్ని కాలువగా అనుకుంటే
నీకు వేరే గతే లేదు.

20

ఆత్మ వెలుగు కైపులో వుంది
ఏకాంతాన్ని కోరును;
జల బిందువులో బంధితమైన
సింధువు అది!

21

దేవుని పులి ఆత్మ
ప్రపంచము దాని వేట;
భూమి దాని వేట;
ఆకసమును దాని వేట!

22

వాసనల, రంగుల ఇంద్రజాలమును
ఆత్మచే ఛేదింపగలము
ఏకత్వ మది, దాన్ని
నీవు గాని నేను గాని గ్రహింపలేము.

23

ఆత్మను ఇయ్యవద్దు
వెండి బంగారములకు మారుగా,
అగ్ని జ్వాలను ఇయ్యవద్దు
నిప్పు రవ్వలకు మారుగా!

24

ఆత్మను కాపాడుకొనగల వారికి
శక్తిమంతమైన విషము కూడ
శక్తిని పోగొట్టుకొని
దివ్య ఆహారము అగును!

25

దేవుని చూచు భక్తుడు
ఆత్మ జాగృతము కాగా,
వాడి గల, కాంతి గల
ఖడ్గము వలె అగును.

26

ఆ దేశమునకు
ఆయుధములతో పని లేదు-
ఏ దేశపు యువకుల ఆత్మ ఆశయము
ఉక్కువలె గట్టి అగునో!

27

నీ విలువ అధికము-
ఆత్మ సంరక్షణ చేతనే
లేకున్న, ముత్యములో
మెరయుట తప్ప ఇంకేమియు లేదు.

28

నీ జీవితము దానివల్ల నే
నీ గౌరవము దానివల్ల నే,
ఆత్మ ఉంటే పాదుషా
లేకున్న సిగ్గుమాలినవాడు!

29

నీ జీవితము ముత్యపు చిప్ప,
వర్ష బిందువు ఆత్మ;
అది ఎట్టి శక్తి—
వర్ష బిందువును ముత్యము చేయలేనిది?

30

జీవిత సారము ప్రేమ;
ప్రేమ సారము ఆత్మ
అయ్యో! వాడియైన కత్తి
ఇప్పటికిని ఒరలో దాగియున్నది.

31

ఆస్తిత్వ మేమిటి?
ఆత్మగుణ ప్రకటన మాత్రమే!
ప్రకటింపబడని గుణమును
ప్రకటించే యత్నము చేయుము.

32

కాలక్రమణః
ఉద్దేశ్య మిదే.
నీకు నీ ఆత్మయే
సాక్షాత్కారము కావలెః

33

నా విధానము ఐశ్వర్యవంతులది కాదు,
సాధు సన్యాసులదే;
ఆత్మను అమ్ముకోవద్దు
పేదరికములోనే పేరు గడించు!

34

రాజుల ఔన్నత్య రహస్యమును
నీకు తెలుపుదునా?
నిస్సహాయతలో కూడ
వారు ఆత్మ స్థైర్యము నిలుపుకొనిరి.

35

ఆకసము క్రిందనే
జాతులు చెడ్డ పేరు పొందినాయి
సాహిత్యము, మతము
ఆత్మకు దూరము కాగా.

36

ఆత్మ పోషణ చేతను,
సాక్షాత్కారము చేతను
బానిసత్వము నుండి జాతులు
విముక్తిని పొందె నని వింటిని.

**37**

ఆత్మ ప్రేరణచే
ఆవగింజ పర్వత మగు
ఆత్మ బలహీనతచే
పర్వతమే ఆవగిం జగు!

**38**

ప్రకృతిని చూపించితివి
చూచితివి నీవు,
ప్రకృతి దర్పణములో
సొంత ఆత్మను చూపు!

**39**

నిరుపయోగము చేయకు
అనుకరణచే నీ ఆత్మను,
దాని సంరక్షణ చేయుము
అది తులలేని ముత్యము!

40

విద్యా ద్రావకములో
నానవేయుము నీ ఆత్మను
మెత్తనకాగా వినియోగించు
ఎక్కడ వలసిన అక్కడ!

41

నీ ఆత్మలో విప్లవం పుట్టితే
నాలుగు దిక్కులు మారినా
ఆశ్చర్యం లేదు.

42

ఆవిష్కరించుకొనుటకు
నీకు సాహస ముంటే,
వాతావరణము సంకీర్ణ ము కాదు.
దేవుని మానవుడా! దేవుని దేశము
సంకీర్ణము కాదు.

43

ప్రకృతి కార్ఖానాలో
శాంతి దుస్సాధ్యము
పరివర్తన పరంపరతో
నిండియున్నది యుగం.

44

నీవు ఆత్మాభిమానం కలవాడవై
సాకీకి కూడా కృతజ్ఞతా పాత్రుడవు కావద్దు
ప్రవాహములో నీటిబుడగవలె
నీ పాన పాత్రను తల్లక్రిందులుగ
ఉంచుకో!

45

ఈ కాలములో కూడ
విజ్ఞులగు మానవులకు ప్రాప్తి కాగలదు—
పర్వతమును ఆవగింజగా
చేయగల దైవశక్తి.

46

ఆకసమువ కన్న ఉన్నతము
మానవుని స్థానము,
సభ్యతకు ప్రధానమగు లక్షణము
మానవుని గౌరవించుటయే.

47

మానవుని గౌరవించుటయే
మానవత్వము
మానవుని అంతస్థుతో
ఎరుక కలిగి ఉండుము.

48

మానవుని అన్వేషించడములో
ముందడుగు వేయుము.
దేవుడు కూడా
మనిషిని వెదుకుచునే ఉన్నాడు!

49

ప్రపంచములో

ఆ మానవులే ఉత్తములు-

ఇతరుల పనులలో

ఉపయోగ పడువారు!

50

ఇదే ధర్మము, ఇదే పూజ,

ఇదే సచ్చరిత్ర కూడ:

మరియొక మనిషికి

ఉపయోగపడు మనిషి కావడమే!

51

కాకూడదు నీ గూడు

సుల్తానుల మహళ్ళ గుమ్మటాల్లో-

నీవు గరుత్మంతుడవు

పర్వత శిఖరాలలో కాపురము చేయి.

52

గరుత్మంతుని విలాస నైపుణ్యము
కోకిలలో ప్రకటిత మగుచున్నది—
ఎట్టి పరివర్తన చెందుచున్నది
ఉదయమును లేపు శకుంతములలో!

53

శ్రమపడు మానవులకు
సంకీర్ణము కాదు ప్రపంచము;
పులుల గుండె కావలె
గరుడుని దూరదృష్టి.

54

బానిసల నెత్తురును
విశ్వాసపు జ్వాలచే ఉడికించుము.
బలహీనమైన పిచ్చుకను
గరుత్మంతునితో పోరాడించుము.

55

కాకిలో పుట్టలేదు
ఎత్తు ఎగిరే శక్తి;
కాకి సహవాసం
గరుడుని పిల్లల పెడమార్గమున పెట్టెను.

56

పక్షుల ప్రపంచములో
నేను బైరాగిని
గూడును కట్టుకోడు
గరుత్మంతుడు.

57

ప్రొద్దు గడుపును
కొండల్లో, ఎడారుల్లో-
గూటిలో బందికావడం
గరుత్మంతునికి అవమానము!

58

విద్యా సంస్థల అధిపతులపై
నా కిదే ఫిర్యాదు:
గరుడుని పిల్లలకు నేర్పుతారు
మట్టిలో పొర్లాడే పాఠాలు.

59

జీవించియున్న హృదయమునే
ప్రేమదృష్టి వెదకును,
ఉపయుక్తము కాదు
గరుత్మంతునికి చచ్చిన జీవి.

60

నీవు గరుత్మంతుడవు
ఎగురుటయే నీ కర్తవ్యము
నీ సమ్ముఖమ్మున
మిన్నులు ఇంకా ఎన్నో ఉన్నవి.

61

ఆచరణచే జీవన నిర్మాణము
స్వర్గమైనా, నరకమైనా,
స్వభావముచే ఈ మట్టి మనిషి
స్వర్గవాసి కాడు, నరకవాసి కాడు.

62

నిరంతర భ్రమణలచే
తయారైనది గట్టి జీవన పాత్ర.
ఈ శాశ్వత రహస్యమును
తెలిసికొనలేకుండుటయే మనందరి
జీవనము.

63

జీవించియున్న వారిలో ఉంటే
నీ ప్రపంచమును నీవు సృష్టించుకో.
నీ అంతరాత్మ సంకల్పసిద్ధియే జీవనము,
అదే మానవ రహస్యము.

64

ప్రకటించు
దాగియున్న జీవన శక్తిని,
నిప్పు రవ్వలనుండి
శాశ్వత దీప్తిని పుట్టించు!

65

పరువు కొరకు కోరిక ఉంటే
ఈ జీవితపు తోటలో
ముళ్ళలో తగుల్కొని
బ్రతకడం అలవాటు చేసికో.

66

తేట తెల్లము చేసెను
నాకు ఈ మాట 'కలందరు'*
పరాయివారి ఎదుట నడుము వంచినపుడు
మనసు గాని తనువు గాని నీవి కావు.

*(సన్యాసి)

67

యౌవన ముంటే, చూడవలయునని కుతూహలము,
అభిలాషల ఆనందము కూడ!
ఈ అతిథి ఉన్నంతవరకే
మా యింటిలో ఇవి కాపురము.

68

మలచుకో నీ సొంత గొడ్డలితో
నీ సొంత దారిని
పరాయి వారి దారిలో పోవడం
దుఃఖముల చేకూర్చును.

69

విద్రాణములైన అభిలాషలు,
కోరికలు లేని హృదయము నా కంట
పడలేదు,
పరమేశ్వరా! ప్రపంచమును ఒనర్చితివి
వాంఛల ప్రదర్శనశాలగా!

70

తెలివిలేని శలభము
దీప ప్రదక్షిణములలో స్వాతంత్ర్యమును
పొందెను.
తన స్వభావపు వైభవము
అచటనే విడిది చేసెను.

71

శూన్యతతో పరిచయము
లేని మానవుడు
కన్నుమరుగై పోవును,
కాని నాశనము కాదు.

72

కొలది మొగ్గలతోనే
తృప్తి పడితివి అజ్ఞానుడా!
లేకున్న తోటలో
చిన్నదైన ఈ కొంగు కూడ విస్తరించ
వచ్చును.

73

బిందువు జీవిత చరిత్ర
జీవన రహస్యముల నేర్పును;
కొన్ని వేళల అదే ముత్యము,
హిమబిందువు, అశ్రు బిందువు కూడ!

74

మానవుని జీవితము
కలకూజితముల విహంగము.
కొమ్మపై కూర్చున్నది కొంత సేపు,
పాడింది, ఎగిరిపోయింది.

75

మరణించువారు
మరణించుచున్నారు
కాని ఎప్పటికిని వినాశము చెందరు
మనతో వేరు కారు-ఇది నిజము.

76

కాల దర్పణములో
నేడు నీ సోయగము చూడు!
ప్రపంచ భాగ్య విధాతా!
నా సంతోషము పరికించు!

77

పాశ్చాత్యుల విలువైన సీసాలు
కృతజ్ఞతతో ఎత్తకు
భారత వర్ష పు మట్టితోనే
నీ కూజా పానపాత్ర చేసికో!

78

వ్యక్తుల హస్తములలో కలదు
రాష్ట్రాల అదృష్టము;
ప్రతి వ్యక్తీ కావలె
దేశభాగ్యపు నక్షత్రము.

79

తన్ను చూచుకొని
తన్ను నిర్మించుకొని
తన్ను ఆత్మలో పరివేష్టించుకొన్నచో,
చావుతోను చావకుండుట సాధ్యము.

80

ఎవడు తన సాహసముతో
కాల జలధి నుండి
'రేపు' అను ముత్యమును పైకి తెచ్చునో
అతడే సాహసవంతుడు!

81

బానిసల దూరదృష్టిపై
విశ్వాస ముంచలేము.
ప్రపంచములో స్వతంత్రమానవుల
కన్నులకే కలదు చూపు.

82

విముక్తులగు భక్తుల
ఉన్నతి వేరు,
వారి మరణము ఇచ్చును
ఇతరులకు ప్రాణము.

83

మత గురువుల అద్భుతాలు బానిసలను ఆకర్షించును
విముక్త భక్తుడు స్వయముగ
ఒక సజీవ అద్భుతము!

84

వాంఛల వేడిమిచే హృదయము
జీవితమునే పట్టివేయును,
దుష్టమైన వాంఛలతో మరణించును
పట్టుబడిన జీవితము.

85

సుగంధ సువర్ణ ముల ప్రపంచమునకే
ప్రాణము వాంఛ.
ప్రతి జీవి స్వభావములో
భద్రపరచ బడ్డది వాంఛ.

86

నవ సభ్యత నీతి
మానవుని హింసించడం.
మానవుని హింస తెర వెనుక
సాగుతుంది వ్యాపారము.

87

పాదుషాల వైభవము కానీ
ప్రజాస్వామ్యపు తమాషా కాని,
రాజకీయాలనుండి ధర్మము వేరైతే
అత్యాచారము అధిక మగును.

88

వేలకొలది భగవంతుని ప్రేమికులు కలసు-
అడవులలో తిరుగుచు వేసారువారు;
దేవుని దాసుల ప్రేమించువారి
దాసుడను అయ్యేదను నేను.

89

సౌహార్దతతోనే ఆరోగ్యమును పొందెదు
రోగగ్రస్తములగు రాష్ట్రములు
దానితోనే తమ నిద్రిత అదృష్టములను
మేల్కొల్పినవి రాష్ట్రములు.

90

తారలకు పైన ప్రపంచాలు
ఇంకా ఎన్నో ఉన్నవి
ఇప్పటికీ ప్రేమ పరీక్షలు
ఇంకా ఎన్నో ఉన్నవి.

91

ప్రాణము లేక
ఈ వాతావరణము లేదు;
నూర్ల కొలది బాటసారుల జట్టులు
ఇక్కడ ఇంకా ఎన్నో ఉన్నవి.

92

తృప్తి చెందకు
వర్ణ సుగంధముల ప్రపంచముతో;
నందన వనములు యోగ్యములైన నీరములు
ఇంకా ఎన్నో ఉన్నవి.

93

ఒక్క గూడు పోగానే
ఎందులకు ఇంత చింత?
నిట్టూర్పులకు ఏడుపులకు చోట్లు
ఇంకా ఎన్నో ఉన్నవి.

94

నీవు పక్షిరాజువు,
ఎగురుటయే నీ పని;
నీ యెదుట మిన్నులు
ఇంకా ఎన్నో ఉన్నవి.

95

ఈ దిన యామినులలో
చిక్కుకొని ఉండిపోకు;
నీ అవకాశాలు, ప్రదేశాలు
ఇంకా ఎన్నో ఉన్నవి.

96

గతకాలములో గోష్ఠిలో
నేను ఒంటరిగా ఉంటిని,
ఇప్పుడు, ఇచ్చట నా విషయముల నెరిగినవారు
ఇంకా ఎంతో మంది కలరు.

97

నీవు ఆకసము కొరకు కాదు,
భూమి కొరకు కాదు;
ప్రపంచము నీ కొరకై ఉన్నది,
నీవు ప్రపంచము కొరకు కాదు!

98

ఉన్నవి నీ అధీనములో
ఈ మేఘాలు, వర్షపాతాలు,
ఈ గుండ్రముగా ఉన్న ఆకసము.
మౌనముగా నున్న వాతావరణము!

99

ఈ కొండలు, ఎడారులు,
సముద్రాలు, పవనాలు,
నిన్నటివరకు గంధర్వుల వినోదాలకై
వారి ఎదురుగా ఉండేవి.

100

నీవు నిర్మించే ప్రపంచమే నీది
నీకు కాన్పించే రాళ్ళు, ఇటుకల ప్రపంచం
కాదు.

101

మనలో మనము పోరుటను
మతములు నేర్పలేదు.
భారతీయులము మనము
దేశము మనది హిందూస్థానము

102

సమస్త ప్రపంచములో
మెరుగైనది మన హిందూస్థానము
కల ప్వనముల విహంగములము
ఇది మన నందన వనము!